

## సంగీత
# జయంతజయపాలము.

### చతుర్థాంకము.

[రాజమందిరము ప్రవేశము సత్యపాలుఁడు, గుణవర్మ, వసంతసేన.]

వ—(స్వగతము) పుష్పవతి యేలకో యదృశ్యమయినది. నృపాలు సమక్షమున నామెవిషయము ప్రస్తావనవచ్చిన నేనుత్తరవాది నెట్లగుదునూ. అయిన నాప్రత్యుపకారార్థముగాని తెచ్చిన యీసభాస్థలిముంగట మనస్సంకోచమేల [ప్రకాశముగా]

చ. సకలచరాచరాత్మమయి సర్వదిగంతరవిస్ఫురితాప్తమై
ప్రకటముముక్షుదాయమయి ప్రాభవమింగను వీరమాతయై
చకితపరార్థరక్షయయిత్సౌలతికిం సుఖసంప్రదాయమై
ప్రకృతికి భూషితంబయిన పార్థివమూర్తియివే ప్రణామముల్.

[నమస్కరించును.]

సత్య—మంత్రిసత్తమా! ఈసందేశార్థము లేమి.

సీ. భూదేవతల్ క్రిమ్ముమ్మన భక్తితాత్పర్య
యుక్తులాదురె రాజయోగములను
సామంతభూపాల సంఘమే నెరలేక
వర్తించు నేయిష్ట వాంఛితముల

పరమార్థచింతయే పాటించి వైశ్యులు
వ్యాపారవృత్తులవదలకుండె
జాతివిద్వేషము రచ్చకురాకదాసులై
భద్రంబుగాంచునే శూద్రజనము

గీ. తక్కుగలవారు పాటింత్రె ధర్మములను
భర్తృసేవలగురిగొందె భామలెల్ల
పెద్దలను గౌరవింతురె పిన్నవారు
కువలయంబెంత క్షేమమే గుణవరేణ్య.

గుణ—రాజపుంగవా! న్యాయమును పాటించి యధర్మములనిరసించుట లో "యథారాజా తథాప్రజా" రాజమార్గమును వర్తించుట యే యనుసరించుటయే ప్రజాసామాన్యమున పరిపాటుకాదా.

గీ. తల్లిదండ్రులరీతి సంతానమేగు
శిష్యుడేగును గురుబోధజిత్తగించి
ధాత్రిసారంబునకు సారంబుజిక్కు
రాచపోడిమియే ప్రజారాజిఁదనరు.

కావున దేవరమనస్సంకల్పసిద్ధియేయగు నిలావృత్తాంతము వివరింపనేల?

సత్య—[మందహాసము] సచివాగ్రిణీ! నీయప్రస్తుత స్తుతిపాఠములా చెంగటి కాంతాలలామయేమప్పినదాయేమి?

చ. మృదుమధురప్రసంగములు మేల్మిసభాహితవాక్ప్రవాదముల్
సదమలధోరణుల్ విపులచర్చలు సద్గతిదోహదంబులున్
బెదరు ప్రయుక్తులుఁ నటసభేషజముద్గమనంబు చిత్తస
మ్మదమది నేర్చుకోవలెను బోటులముంగట బ్రహ్మయేనియుఁ.

గుణ—సర్వాంతర్యాములగు నపరబ్రహ్మలయెదుట నేజెప్పవలయున దేమున్నది? ఈలలామముఖస్థముగా మనము దెలియవలయు

విశేషములున్నవనియే దేవరదర్శనార్థమై భవదీయసమక్షమున కాజ్ఞ బడయవచ్చియున్నది

గీ. పనికిరావంచు గొండలపాటిగొనము
పెదగిగొందుము చిన్నిరాల్ విలువకేసి
యోగ్యమయినట్టి వస్తువెంతున్న నేమి
గుణముప్రాముఖ్యమగును లోకులకు నెదు.

సత్య—అట్టియిన నవశ్యాచరణీయము శిసారవహము.

గీ. ధనమువిద్యయు సద్గుణధర్మములను
నీతిబుద్ధియు వైరాగ్య నిష్ఠలెల్ల
గరముగ్రహింపగానగు జ్ఞానులైన
పిన్నపెద్దలు మీమాంసలెన్న లేక.

వసం—(మందహాసముతో) అబలలయందలి వాత్సల్యమునఁజేసి నన్ను త్సాహపరుప నట్లుగ్గడింతురే కాని.

సీ. గురువులా బోధించి గుణములనేర్పగా
తల్లిదండ్రులదొడ్డతనముఁ జూవ
తోడునీడయయునం తోద్ధతినిఁజూట
పాటిబందుగుల ప్రాశస్త్యమీయ
మిత్రవర్గంబులా మేల్మిహత్కర్షింప
స్థానబలఁబ ప్రాధాన్యతలకు
కులగౌరవంబులా గోప్యములీడేర
పౌరుషవృత్తియా పాడిజేయ

గీ. దిక్కుదీములలోకము దెక్కగరవ
ధనముధాన్య మసంతుష్టినసరియుండ
దాసదాసీజనంబులా దర్పమునకు
వెడగు వేశ్యకు గుణమేడ విద్దెయేడ.

సత్య—మంత్రిసత్తమా! ఈమెవేశ్యమాతయా మాదర్శననిమిత్తమైరా గతంబేమయియుండును.

మ. ధనమున్ గోరన మాన్యతల్ గొనన సంతానార్థమైవృత్తులన్
గననా యత్నముజేయనారిపుల శిక్షధర్మమాదాయమున్
గొనసా లేడనమాదుప్రాప్తకములర్గొండొక్కటిర్గొల్వగా
వినపింపింపలెశీఘ్రమే విపులమా వేశ్యాత్వదీయార్థమున్.

గుణ—దేవా! భక్తవత్సలురగు తమసముఖమున నామెయర్థింపవలయు నదేమున్నది- స్వకార్యార్థియై వచ్చియుండదే.

సత్య—నీవాక్యానుసారముగా నామెపరోపకారబుద్ధికిమేము సంతసించి యావృత్తాంతమును సాంతముగావినియుంప వలయుననియాజ్ఞా పించుచున్నాము.

వసం—ఆర్యవరులారా! భూపాలచంద్రమా జన్మవేశ్యను విద్యాగంధ విహీనను- పౌరుషహీనమయిన - స్త్రీసంజాతను- ప్రాభవమా ప్రశస్త్యమా- కులాచారధర్మమా.

గీ. మగటిమినిగల్గి ప్రాభవమ్మందవచ్చు
చదువులనునేర్చి గనసౌనుజాలకీర్తి
ధనమునంజేసి సాధ్యమే ఘనతమైన
కానిమాన్యత ఈవేశ్యకాంతకేల.

సత్య—ఏమివేశ్యమాతా! నీగుణభాగ్యమా సచివాగ్రిణీ యీామెపై ఖరి స్త్రీజనాపూర్వముగానున్నదే.

గుణ—ఏవత్ కారణమునజేసియే మన దూతకృత్యమును నిర్విఘ్నము గా నెరవేర్చిమనలఁ గృతకృత్యులగావించినది.

సత్య—ఓహో! మనచిరంజీవుల విషయములా - ఎట్లుకృతకృత్య యయినది...

గుణ—మిత్రభేదముచే వారిసాధించి యొకసమాధానమునకుదెచ్చిస్త్రీ సహజమయిన బుద్ధిచాతుర్యమున కుత్తమసాక్ష్యమిచ్చినది.

సత్య—స్త్రీరత్నమా! నీయుక్తివిశేషములు నీవాక్యములుగావివరించి మాపీనులవిందొనరింతువుగాక.

వసం—మంత్రిపుంగవుని సందేశముకంపునలేఖలు సంగ్రహించి యుద్యానవనసీమల విహారార్థమయి బయలువెడలు రాజకుమారుల వెనువెనుకనే వచ్చెన్నమతిని వెడలితిని.

సత్య—చిరంజీవులు ఏకతంబ పురబాహ్యప్రదేశములసంచరింప నీవువెన్నంటితివికదా తర్వాత.

గుణం—రాజ్యవిచారము లుడిగి స్వేచ్ఛావిహారమొనర్పిగాబోలు.

వసం—ఆర్యవర్యా! పుత్రాభిమానమున్న నట్లుండును. బాలకులుమార్గాయాసమునం బడలియుందురన్న మీతలంపు. అబలనేకతంబపాదచారినై వెడలితినన్న నాశ్రమం దలపోయరేల? మహాత్ములకైన కొనవపక్షపాతముండకపోదు.

గుణ—కాంతామణి! నీకు మాయందభిమానమున్నట్లే

వసం—విద్యావంతులు - రాజకార్యధురీణులు, యుక్తులసముయసూర్తులు కొనితేవలయునా! అట్లయినవారు స్వల్పదూరమేగి బడలికదీర నొకవృక్షచ్ఛాయ నాసీనులైరి.

సత్య—నిర్మానుష్యమగుపాంత నాగరికులెవ్వరు వారిరహస్యవర్తనముల గుర్తింపంజాలరని విశ్వాసము

గుణ—నృపాలా! డింభకులకంత దీర్ఘాలోచనమా. బాల్యోత్సాహముకాని.

క. కలిగిన పోయినవ్యసనం
బులకింతయు తావులేదు బుధులకెందుక్

కలవారలుండి వెనుకం
గలకాలముదిద్దుబాటు గల్గినమేకలన్.

ఉ. ఏలుదమన్న కాంక్షయు మహీతలమెల్ల తదేకదీక్షతో
గూలుదమన్న వాంఛ రిపుకోటుల ఘోరరణాంగణంబునన్
చాలుదమన్న యాశ భువిజానుల మించుపరాక్రమంబునన్
బాలుర సౌఖ్యకాలములువచ్చునె కాలముమీరుపిమ్మటన్.

నిర్విచార, నిర్మల నిరతానందస్వరూపమునకు మూర్తియగు బాల్యా
వస్థ-రాశీవికదా.

సత్య—మంత్రిసత్తమా! నీవ్యాఖ్యానము సర్వాంగీకారమేయగు స్వే
చ్ఛావృత్తులకన్నచో విశేషనియమబద్ధమగు నీయుర్వీతలమున
రాజ్యభారమునెడ ప్రకృతినిర్యాణమునందు చెల్లనేరదు. అవ
స్థాభేదమే స్వాతంత్ర్య మగుచున్నది. కాని కర్మసూత్రముపట్ల
బాధ్యతతప్పనేరదు.

గీ స్వేచ్ఛగావచ్చి వాహినుల్ క్షీరమగును
స్వేచ్ఛగావీచి వడిసుట్టుజెందుగాలి
స్వేచ్ఛఁ బెంపొంది భూజముల్ క్షితికిఁ దెల్ఘ్ను
బాలకులస్వేచ్ఛ పెద్దలపాల్లైగాక.

మరియు, మొలకైవంగక మ్రాకైవంగనేచ్చునా?

చ. నయవినయంబులన్ గరపన్యాయమధర్మము నేర్పలిహింసయున్
దయయు బ్రబోధసేయఁ బ్రణుతార్థవిచక్షణ దీర్పబొందన
వ్యయగుణసంపదల్ బొదలవ్యాజము భేజషముల్ గ్రహింపవి
ద్యయెగత నేర్వగానలెవ్వధాకద శాల్యముచాట నేర్పులున్.

గుణ—లోకానుభవము యుక్తిసంపన్నత, ఈభామినిపట్ల నెవ్వరు
శ్రద్ధఁబూని పనిపట్టి యగత్యపడి బోధించియున్నారు. పుస్తక
జ్ఞానమే ప్రాణహీనమగువాదము.

గీ. జ్ఞానమంచును విద్యయేగరచుటెల్ల
సారక్షీనములోకావసరముఁగామి
యనుభవంబునకైనదేయగునువిద్దె
జన్మసార్థకమైనదేజపముఁదలప.

చదువుకొన్నవానికంటె చాకలి మేలందురు.

వసం—పండితోత్తములారా! ప్రభుసత్తమా, యుక్తిని మించుమాత్ర మున వేదములపార్థములైనచో. దానవులకు దైవత్వసిద్ధివచ్చునా? నాత్రిజ్ఞాశేషముకంటెనా హితురాలిద్రోహమే నా కుపకరించినది. ఆమెవంచెనయే ప్రస్తుతింపనగును.

సత్య—సచివాగ్రణీ! ఈపెచేటికి యొనర్చిన ద్రోహమేమి?

గుణ—దేవా! మనగాపత్త్యేకించి యీకృత్యమున కీమెను నియోగించుట కంటగించి పుష్పవతి మచ్ఛరముఁబూని యీమెప్పుమంను తానెగడియింప సీమెతు మనమందజేయు పరికరముల ననుకరించి వానిని - మనకుమారు లొండొంటరిగానున్నతరుణమున-నందఁజేసెను.

వసం—మన్నింపుఁడు-నాయన్వయగోత్రముల నటించుచుజయంత కుమారునిహస్తగతమొనరించి యదృశ్యమయ్యెను.

సత్య—వసంతసేనా! ఒకయుద్దిగానున్న చో వారిరువురిమధ్య పుష్పవతి-

గుణ—దేవా! అంతకుమున్నెవిశేషములేమొ వివరించునోయన్నమిష జేసి- వసంతసేన- జయపాలుని తనవశంవదుని గావించియున్నది ఇదియే చిత్రఘట్టము-

సత్య—స్త్రీలకు లోకసంగ్రహణత్వములో బెట్టినదిపేరు!! ఏలనః-

సీ. సర్వసర్వంసహా సంకల్పదత్తుఁడౌ
బ్రహ్మమేభామిని వాతఁబడియె

విశ్వసంరక్షణా విరళసంధాయియగా
మాధవుండే కాంత మనికి నయ్యె
సకలచరాచర సంహారకారుఁడై
భర్గుడే భామిని కాలువడియె
మోక్షకర్మారంభ ముఖ్యోపపత్తియగా
భానుఁడేయి: తిశోభకును మఱిఁగె

గీ. సప్తఋషులును సంసారసంగులైరి
యేకతంబున! భామినీ, లోకమునకు
వశ్యములుగాక చరియించు వాఁడెవండు
బాలకుల కేడ, స్వాధీన, పదుట, ఘనమె.

గుణ—ప్రభుసత్తములు-మనవసంతసేనాపుష్పవతుల యుక్తిస్వారస్యము సాంతముగా వినవేడుచున్నాను. దేవా! భేదబుద్ధి బూనకున్నచో యుక్తికిపరిసారము నదిపరిగణించినకాని రాచకార్యమునుకానేరవు

చ. కలిగినదంత దెల్పునేడు కాదుగదా మనకార్యసిద్ధమా
టలవలఁ బన్నియుక్తినిగదా వ్యవహారము సానుకూలమౌ
కలికినిఁబూన్పకున్నఁ గనుఁగానరుగా నొకమాత్రిడింభకుల్
తెలువడు కార్యముల్ నిలిపి పెట్టులుగొన్నిటిఁ జేయమానుచో.

వసం—ఆర్యా, కుతంత్రమునఁగాని యిరువురుప్రాణహితులు, బాల్యస్నేహితులు, ఏకైకదీక్షాపరాయణులు, ప్రత్యేకకార్య నిర్వహయత్తచిత్తులు వికల్పమంది నిరుత్సాహపడుటెట్లు?

చ. బలియులు స్వేచ్ఛవృత్తులు నభంగరస్నేహసమన్వితుల్ మనో
కలిత తదైకదీక్షితులు కార్యముఖుల్ గడుగూర్చునెచ్చెలుల్
వలచి విహారసద్గతుల వారితసంగతినేగుచున్నచో
సులభమె మిత్రమానస విశోషితరీతి, నియుల్ జేయుటల్.

గుణ—లక్ష్మీలామా! విద్యాప్రయోజనము బుద్ధివిస్తారతకు గొఱగాదని యే మాయభిప్రాయము నిర్వ్యాజమగుకొపఱుము ఫలోన్ముఖమునకురాదు. అనుభవైకవేద్యములుగాని నేర్పులేల?

వసం—అట్లావనవాటికఁ గూర్చుండుటయు హారి హృదయాకర్షకమైకంఠోక్తిగా నాలాపించితిని. జయంతకుమారుఁడాలించి నన్నరసి గొంపోవవచ్చుటయు

ఉ. కార్యముగల్గునట్లు మమకారముజూపెడురీతిచింతలో
ధైర్యముఁ బూనుమాడ్కి గతిదప్పినభాతి, విరోధివర్గముల్
క్రౌర్యముగాంచువైఖరి సుఖాస్పదవృత్తి నసించుబోల్కి నే
నార్య జయంతుదవ్వుల వనంబునకుం మృషజేసిదోడ్కొనన్.

సత్య—జయంతుని సాంగత్యమెకడైయె జయపాలుఁడొంటరియయ్యెను సమయమునకు వేచియున్న పుష్పవతికిదే మంచితరుణము.

గుణ—వసంతసేన సమయస్ఫూర్తియే యామెదుర్వృత్తికి యవకాశమిచ్చినది. అదేపనిగా పుష్పవతి తనప్రచ్ఛన్నవేషముతో జయపాలకుమారుఁడు, రాకొమరుని దండింపనెపముఁబెట్టి వనపాలురకు రహస్యముగాఁబంపిన వన్నకల్పితలేఖలందజేసియారహస్యహంతకులఁ దోడితెత్తునను నెపమున నదృశ్యమయ్యెను.

సత్య—ఏమేమి! ఆడుపన్నాగములు, రాజయుక్తులఁదలదాటుచున్నదే! వసంతవైవృత్తాంతమేమి.

వసం—రాజా! క్షమింపుఁడు.

క. అటునిటుదిక్కులనల్లడ
బటుసంశయమతినిగాంచి పరిత్యక్షమునన్
దటుకునజెవులన్ బల్కితి
నిటువడ్డులలోన బియ్యమింతేయనుచున్.

ఉ. రాజకుమార దుర్మతిని రాకడ జూడక పెద్దజేసియీ
యోజనుబంప సైనన యోగ్యత నేర్పక నోటికొద్దిగా
మోజులుబుట్టు నెయ్యదియొ మోసముఁ జేతకుఁ గాకశీఘ్రమీ
వాజినిఁ గూల్పనే యొకటవచ్చుట నాశపథంబు పెంపునన్.

గుణ—ఏతదర్థమపార్థముగా గ్రహించుటయే కాక జయంతకుమారునకు నంతరంగమునకొక మోసమురీతి బొడగట్టినది. తదనుకూలముగా రాకొమరుడు సత్వరము లేచి రాగడఁగనరికి మనకైక టు పుష్పవతి శుభలేఖ నందించుటయు, దీవాగ్ని హోత్ర మునఁ దిగబోసిన తైలముచందమున ద్విగుణీకృత క్రోధపూరిత హృదయమైనది. అనుమానము ప్రాణసంకటముకదా.

సత్య—స్త్రీపాత్రలెచ్చటదాగినవి?

గుణ—నృపోత్తమా! వానినాట్యమును ముగించి యదృశ్యమయినవి.

వసం—వానిపనిముగించి భవదీయదర్శనార్థమై యీసభాస్థలిని వేచి యున్నవి. కథావిధానమంతయుఁ జిత్తగించితిరా?

సత్య—సచివోత్తమా! పురుషపాత్రహీనమగు నాటకము రక్తికట్టదు కదా. మనచిరంజీవుల ప్రస్తావనలేమి?

గుణ—కథానాయకురాలినే ప్రశ్నింపుఁడు.

సత్య—అపూర్వనాట్యరంగమున ప్రధానపాత్రయయి తనకూలంకష ప్రజ్ఞావిశేషములఁ బ్రయోగించి సర్వజనామోదమును బడసిన సూత్రధారి. తనవేషము నుజ్జగించి కార్యభారమును పాలుకొన్న పుష్పవతిని కార్యరంగమునకుఁ బ్రోద్బలించునుగాక. వసంతా నవహావేషధారిణియెచ్చట?

వసం—ఆమె బ్రహ్మాంశసంభూతురాలు. అపరనారదావతారముకావున నేలోకమున, బరివర్తించుచున్నదో.

గుణ—దేవా! ఇంతకు మనవసంతకు మంచిరోజువచ్చినది, అట్టూ పిట్టూ అనాదారునది- రవ్వారట్టూ గంగానమ్మది - ఈరవాస్తే

ము వెల్లడియైన దివానమువారు ప్రాయశ్చిత్తము జేయుదురను భయముచే చల్లగా పరదేశముఖమైనది.

సత్య—అటులయిన వసంత, మంత్రాంగమున సుప్రసిద్ధురాలు - లేని చో నిట్టిసంకల్ప మాత్రసిద్ధి భించదు శత్రువిజయమన్న నిట్టిది. అంతరంగిక శత్రులసహితము జయింపకున్న తరుణోపాయము గానరాదు.

గుణ—మనచిరంజీవులను నిజమనోజ్ఞపదేశ విశేషముచే రాజనీతికోవిదులనొనర్చిన యీ గుర్వీతమ దేవదాసియని తెల్లమైనవెనుక-ఇందుపై నుత్సాహప్రభుమంత్రి శక్తులనప్రమత్తులరై చేయింప శపథంబుఁగొని వసంతసేన పంపున దేవర యాజ్ఞనొంది రాకొమరులిక పైలోకానుభవార్థము భవదీయ రాజ్యము శేషముఁ బర్యటించి రానున్యుక్తులై తమయాశీర్వాదమునకును వసంతసేన యాజ్ఞకును వేచియున్నవారు.

సత్య—శుభస్యశీఘ్రమ్, ఈమె నుచితసత్కారములఁ దేల్పుఁడు.

వసం—అనాథస్త్రీసత్కార మొనర్చుటకు మీప్రజాపార తంత్రమే కారణం.

శా. శ్రీరంజిల్లగ దుష్టవర్తనులసంౘ జొడాడినన్మాన మిం
పారం శిష్టులరక్షజేయ ఘనులన్ పాలింపగా మూర్ఖులన్
దూరన్ సద్గతినుత్సహింపను వృజమున్ దూలించి సత్కర్మలన్
బూరింపన్ ధరధర్మమార్గము లెప్పుఁదప్పిపోకుండగన్.

గుణ—"స్త్రీబుద్ధిః ప్రళయాంతకం" అని యెందుకు లోకముద్ఘోషించుచున్నది? మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అనువాక్యములు పాటించునంతకు—

చ. అనుభవసిద్ధమై ప్రకృతియంతకువన్నె బిడారియై యశం
బునకు సమగ్రమై గుణంబుముక్తెటుతావ యిసుప్రకీర్తికిం

ఘనలకు మేటిబేరమయి గర్వనమున్నతికిం గిరీటమై
మనుగడయైన పౌరుషము మాటమె చాలదె దేశముక్తికిన్.

వసం—దేవా! మీయాశీర్వాదము స్త్రీప్రజ్ఞావిశేషములఁ గొనియాడఁజెల్లునే మీవంటిసచివోత్తములు-

మ. కరమున్ గూల్చి, విడిల్చి శత్రువులలోకంబెల్ల రంజించను
ద్ధురదర్పంబు వెలార్పగాఁ బ్రణుతులన్ దోడ్తోనగై కోగదు
ర్భరసంక్షోభము మాన్చి పేర్గన మనోప్రాబల్యముం జూపదు
స్తర సంసారవిపాకమున్ గడవప్రస్తవ్యంబె మాబోంట్లకున్.

సత్య—కాంతా గుణకర్మవిభాగసమైన జన్మసార్థకముకదా.

ఉ. చక్కనిబిడ్డలన్ గనుట శౌర్యమునుం బొరివోకసంపదల్
జిక్కగబట్టుటన్ గురలసేవయు ధర్మప్రవృత్తియున్ గుణం
బక్కరగొంటహింసవిడుటల్ కరుణాతికమైనశాంతియున్.
మక్కువజేయుప్రాణిమహిమాన్వితమంచు నుతింపుకాంచదే.

అవుకాక దేశకాలపాత్రముగా.

గుణ—రాజేంద్రా! కాలమును దూరనేల కర్మపరిపక్వముకానిచో.

సీ. ఘనభూమలందాల్చి కాంతిమించెడుమహాం
గము నెవ్వడిమ్మని కరము వేడె
దివ్యప్రభావమై దేవార్థ గోష్యమూ
దాల్చు లెవ్వరుడు వృథాగ్రహించె
విశ్వసంకల్పమై వేదాంతశీలమూ
మానమెవ్వడు వెలుబరుపుమనియె
పావనదాయమై బాధవిహీనమూ
సత్కళలెవ్వడీసడముఁజేసె

గీ. భక్తసాయుజ్యమెవ్వడ పార్థవరచె
జన్మతో ముక్తియెవ్వ డసాధ్యమనియె

దైవదాస్యంబు లెవ్వరుతాఁ జేసి
గుణముగల్గిన స్త్రీజనకోటియుండు.

వసం—భక్తిలేనిపూజ వట్టిరిచేటంటారుగదా. అబలనసనేల మార్గదర్శకులగు సద్గురులవృత్తాంతములు నాడరేల.

సత్య—అట్లయిన.

క. పరమార్థదాయకంబయి
పరతత్వంబగుచు ముక్తిపరసాధనమయి
పరమాత్మంబగు నాగురు
పరశక్తిందల్తు లోకపాలిన్బోలె.

రహస్యగృహము.

[వ్రచ్ఛన్నులగు కోయదంపతులు, పుష్పవతి, మదనపాలురు.]

కో. సా—నాయకా! మంత్రముంతెత్రమధ పరికిర్తికిఁజిక్కని వశ్యముగాని వారుండరు. మనబోధలు రాకుమారికి పరమతారక మంత్రము లయినవి. నాజ్యోతిషవిద్యయందుగల ప్రావీణ్యమును జాటి మిధునరేఖాంతరాయమును పరికల్పింపుము.

కో. దొ—భర్త్రుసమాగమనములేమి యామెమనోత్కంఠగానున్నట్లు మాటికి వ్యక్తమగుచున్నది.

కో. సా—అటులయిన విరహవేదన పరికల్పించుటతోడనే వెనుకనే దనోపాయము వస్నవచ్చును. ఆచాంచల్యబుద్ధి ఓంప్రారంభ ములోనే కనిపెట్టియున్నాను.

కో. దొ—చిత్రరేఖ పూర్వకాలపు మనిష్యై, మనబుట్టలో పడేవిధం తోచుటలేదు. ఎంతల తుతీసెగమన్నా మనస్సు అనుకూల నివ్వకున్నది. ఈకసీకలియుని జోడాతో వ్యవహారము కలిసి వచ్చేటట్లు కనిపించుడంలేదు. అవుతే పుష్పవతీ! నీవుసోది యింత రంజుగా కంఠాపాఠం జేసావని మెఱుగనే.

కో. సా—ఏమిచేయకపోతే వసంతసేన మోస్తరుగా దొమ్మరిభాగోతం ఆడవలసిందే ఇంతచేయకపోయినట్టయితే మావిద్య చేతన మనుకొన్నారా.

సీ. అందలాలెక్కించి యవిక్రిందుజేయగా
మేటియైనవికదా మేళకత్తు
సింహాసనాలెత్తి చీపుళ్ళనూడ్పింప
గట్టిపట్టముగదా కస్తూరికము
సర్వాధికారుల సామంతులఁ జేయ
మీటెత్తివేతగా మేజువాణి
పెంకిజోగులకైన లంకిసాకట్టింప
వేగమయినదికదా భోగమతము

గీ. పిన్నపెద్దలకొనరీతి బిరుదలివ్వ
ఘాటమయినదికదకళాకాంతమిగుల
గొప్పవరుసల వట్టిల గొట్టజేయు
మరఫిరంగులు మామాటమంతులన్ని.

కో. దొ—అంతబడాయి కొట్టేదానవు ఏదో అభావకకూర్త్తిచేయ అంతఃపురాల్లో పరదాలనాడని అఘోరించే అమాయకపు దాన్ని లేవదీసి రచ్చపెట్టగపోతే ఆమహారాజులుంగారినే బుట్టలో వేసుకొని ఒకాట సాగించకపోయావు. మధ్యను ఈనక్కచావు నాకుతప్పనైనా తప్పేది.

కో. సా—హంగులేనిఆటా రంగులేనిబట్టలోను రక్తిలేదు. స్వర్గానికి పోయినా విడాకులు తప్పవని అక్కడమంత్రి మెలిమొగుడఁతప్పడాయెను. కాదవి బోల్తాకొట్టిద్దామంటే "ఇంటిగాడే కుంటిగాడని" ఆముదిముండ ప్రాణాలై నావిడుస్తుందికాని ఆకోటగు

పుమ్మంపడగెంటినా మెడపట్టిగెంటినా చూరట్టుకొని వేళ్ళాడక మానదు. చిన్నబాబులనిపడి చచ్చేంత అభిమానం.

కో-దా—అవుతే తాచెడ్డకోతి వనమల్లా చెరిచిందని ఈగంజాశాస్త్రహుజూరుకి జేరెయ్యనికదా కొంప తీసి.

కో-సా—హనుమంతుని ముందాకప్పిగంతులు ఈమెత్తుసాగనివ్వండి, దాన్ని చిటికెలో కాళ్ళుకట్టిస్తాను. తనకడుపునిండినబేరం తాగలే నిపిల్లిబోర్లా తోయ్యడమెందుకో కనుక్కుంటాను! ఈగండం గడచిన పిండంబయటపడాలి.

కో-దా—అంతఖంజాయింపుగా తోస్తే నే నదోకిట్టుబాటయేవిధం చూస్తాను. మధ్యను నాసైంధవులడ్డువచ్చి పోనుందికదా ఉంటే, ఒకవరలో రెండుకత్తులెల్లాయిముడుతాయి.

కో-సా—ఏంచేతా కానిమాటలాడతావయ్యా.

సీ. ప్రాజ్ఞతావస్థావరాజ్య పూర్వోక్తసం
ప్రేక్షితార్థవ్యథాభీషణంబు
దుర్వారరాగ సందోహానిర్మూలవి
ద్యప్రభాభాసురానందమయము
ప్రావృట్ సమారంభ పాళికానిర్ధూత
వ్యర్థవాతా తపవ్యాకులమ్ము
ఉద్యత్ ప్రదీ పికాయుక్తముక్తదివా
నిక్షిప్తగంభీర నిర్ఝరంబు
గీ. ప్రకటకల్లోల సంకులప్రధనసీమ
ఘోరదుర్గావరోధకదారుమూర్తి
పక్షవిచ్ఛేదదారుణ భాగ్యమహిమ
నాయకాభోగ మప్పురా వనమ్ముగాదె.

కో-దా——నీనెత్తిమీద తేలంటే నీవేత్తోనేటిద్దూ అంటావు. బాగుంది కదా. నమ్మితే ఒక్క దేవుడునే కోరపాలి. కోడితే కోటకొట్టా లన్న బింకమవుతే నాదొకసలహావినుు?

కో-సా——తల్లికిపట్టరా వసంతమని, నాకుదావ్వసంచెప్పే మార్గంఆలోచి స్తున్నారు మొత్తానికి.

కో-దా——ఆటకుతగిన ఓటుమద్దెల వేయాలి. ఈరాచకూతుర్ని లోట్టీవ కిదింపే పూచీనాది. నీవుమాత్రం త్రిరేఖను స్వాధీనం సుచే కోకపోతే రంగంచెడదు.

కో-సా——తాతకు దగ్గులునేర్పాలా? అవశ్యం మంత్రిశక్తి బుట్టకెక్కి చి వైరాగ్యంమున్నతేనేకాని మనపాయిలో పిల్లిలేవాద్దూ. ఈ మాటనోరుజారిందంటే మనపప్పుడకదు

కో-దా——నామాటవిని దేవోపాసనలోకి ఉంపితివా దిగదోసిచ్చేటంత భక్తురాలు ఇంటినున్నది. ఒంటినిపలక్క మాకదనినీకంపుబయ లుపడిందా మొదటికే మోసమొస్తుంది.

కో-సా——అందీనమజా.

సీ అమ్మోరుపూనించి యల్లల్లలాడించి
పేడదయ్యముపెట్టి పేలజేసి
కోటశక్తినిదంపి గోలెత్తజేయించి
కొండదేవతబట్టి గోలపెట్టి
గాలిముద్దనులేపి గంతులువేయించి
అయ్యవార్లదీసి యాడజేసి
యింటిపేరంటాళ్ళకిప్పించిముడుపులు
దిగదోపు కాళికందింపజేసి
గీ. కనకశక్తులకెత్తించి ఘటములన్ని
వారపోయించి భేతాళభైరవులకు

సేవజేయించి వీరులదేవతలకు
పిచ్చిపట్టింపనే చేటుమచ్చికమున.

కో-దా—బలే అవుతే పనిరొక్కమేలే! జయంతజయపాలురు వచ్చేటందుకు వ్యవధిలేదు. ఈమధ్యనే మనఆట సాగాలి. నీజాడనాకూ నాజాడనీకూ తెలియకూడదు.

కో-సా—దానికేమి మాదొరమంత్రసామగ్రికి దేశమెళ్ళాడని నేను తప్పించుకుంటాను. నీవు నామాటవిని యీనేలసొరంగములోనే డాగియుండుము.

కో-దా—పగలెల్ల ఊసుపోదు. గ్రామసంచారంచేస్తే "రాచపగా త్రాచుపగాఅన్నారు" మనబండారం బయటపడుతుంది. కాదని యిచ్చకాలువేయడానికా రాజాంత్యపురము కనుక తీర్థం స్వార్థం కలిసివస్తుంది. పిట్టల్లాగ చేతచిక్కుతుంది కనుక ఏఆటకామద్దిల వేస్తా. కీడెంచి మేలెంచమని ఈమేదరాంగముతో కాలక్షేపం చేస్తాను. నీపనిమాత్రం భద్రం.

కో-సా—ఈరాచకాంతలు ఇద్దరిమనసూ కొండాగచ్చకాయిలంత వ్యత్యాసముంది. నేను మధ్యనుధూపమువేసి యిద్దర్ని విడదీస్తాను. అసలుకలుసుకోనేకలుసుకోరు. తటస్థించినయెడల ముక్తసరిగా తప్పించుకు తిరుగుచున్న వైఖరికనిపెట్టలేదూ.

కో-దా—కనుక నీయుపదేశాలుకట్టిపెట్టి చిత్రరేఖకు నీప్రసక్తే లేకుండా దేవుడుగుళ్ళోజేరి పొంచియుండు ఆమెరాకడలు. గ్రామవిశేషాలు పూర్తిగా తెలుసుకోవచ్చును. పైగా ఆమెరాకడ కూడా చిక్కుతుంది. పనిముగించి మరేమాట్లాడుదాము.

కో-సా—రాచబిడ్డను చిత్రవధజేసిగాని నాతోమాట్లాడనని చేతిలో చేయివేసినగాని నమ్మను. (ఒట్లుపెట్టుదురు.)

కో-దా—తల్లిపుట్టిల్లు మేనమామవద్ద జెప్పవలెనా! నీమనస్సు చెల్లిం
పనని యింత అవిశ్వాసమైన నన్నుమరచితివా.

సీ. వేషములోటన్న వీరువారనకుండ
ఉత్సవిగ్రహముద్దు లూడదీస్తి
మెడనిండ లేదన్న గుడిశక్తివిదిలించి
ముద్దులన్నియు కట్టమోతుజేస్తి
జేడబ్బు లేదన్న జల్లిగవ్వకుగాక
పసిడికుండలదోచి పట్టగొస్తి
తృప్తాస్తలేదన్న దీపాలుబోర్లించి
నైవేద్యమై తిన్నంగదేస్తి

గీ. చూచినవ్వినకోడెల జుట్టుగోస్తి
ఆడిపోసిన యారాండ్లనిద్దుగొడితి
అవసరంబైన కోయవాడైతినీవు
కోరుకొన్నదికొనసాగకున్నయతివ.

కో-సా—నమ్మనని చెప్పాటందుకా ఎంతకైనా మొగపుట్టుకకనుక ఎన్నటికీపైమాటే నామాటసాగించలేరని అపోహుంటే నాసాటివాణ్ని మాని మీచెట్టపట్టడమెందుకొస్తుంది. నమ్మకాలులేకనే మంత్రాలు తంత్రాలు పుట్టినాయా నామాటతీసెయ్యాలంటే చెప్పలేనుకాని—

సీ. చోరీయటంచును సోదాకివచ్చిన
అటుకపై గూనలో నదములేదె
కుమ్మక్కటంచు గగ్గోలునుజేయగా
దాచనే పుటికలో ధాన్యమంచు
ఫోర్జరీయందు నేప్రొద్దుపెన్నాడగా
జొప్పింపనేపర్పు చుట్టలోన

కూసీయుంచు దిక్కులు దోపకుండగా
భోషాణమున బెట్టిపోయు లేదె

గీ. బాదిపోటన్నమాటనే వామిలోన
దొమ్మిఁ దోలిననుంపనే దొరియలోన
కైఫియతులన్నదింపనే కారువాలు
నమ్మకము లేకపోనె యిన్నాళ్ళనుంచి.

కో-దొ — అట్లయిన వినునాశపథము.

ఉ. చక్కనినీదుమోముఁ గడుచక్కని నీనుదిటీవ్రమైన నీ
దృక్కుల శోభ కొమ్మటసుదీవియలాడెడు హస్తలాఘవం
బక్కరగొండయర్ కుచములబ్బురమౌ హృదయంబు కేళిమై
జిక్కనదేహవైభవము జెల్లునుమీమరుమాటవచ్చినన్.

కో-సా — తథాస్తు. నామాటనమ్మకముపైన యీకార్యసన్నాహము నెరవేరినదా.

గీ. గంగజాతర జేయింతు ఘటములిస్తు
ముడుపులందిత్తు సాముల మొక్కుకొందు
వేటవచ్చెద వ్రతముల వేల్పుకొందు
దేవుడుండిననానోట తీరుపున్న.





సంగీత

# జయంతజయపాలము.

## పంచమాంకము.

[రంగము వనప్రదేశము—అశ్వారూఢులగు రాజపుత్రులు.]

జయ—ఆహా ఈవనసీమ ఈప్రకృతికాంత- ఈసుందరతరులతాశోభితం బగు కాంతారలక్ష్మి, ఈనవకోమల పల్లవిత తరుషండము-ఏ చిత్రముగానున్నది.

మం॥ ఆయెడనుగాంచు మహాహయది యెవన్యమృగమాత్మ! జాతుల
గూడి హావర్తించెఁ గాయములలేజిగుఱు గందమ్ములంటగా
కాంతారకన్నెలఁ గాన్క లాదిచ్చెఁ! మల్లియలజాతులవి! పొ
ల్లములల, బూతలివి! చల్లతెమ్మెరలివి! పల్లవితతరువులవి! గున్న
మామిడితోపు: చిన్నెపూవులగోపు! సన్నవాగెలజాలు! సాన
నెమ్మెలపోరెలు! చెంగుచెంగునచాటు! చిన్నమెకములగుంపు!
రంగైనకోవెలన్ రాచిల్క లాపెంపు! పచ్చలపరువులు! వచ్చె
డుమెరుపులు: వానకోయిల! గానుమీయెల! వనంబులో!
ఘనంబులన్॥

జయ—మిత్రమా స్నేహవల్లికలల్లిబిల్లిగనల్లుకొన్న యేలాలతలఁగాంచుము, కన్నుల బాడువుజేయుఫలావృక్షములు.

మం॥ పూవులకు గాంచుమదె। తీవె పూబోండ్లకుం॥ తీవియలకల్పించు తావులంజూపెన్। కావినాన్పక్షాల। మోచినాఫలముల వీచు పెన్ గాలికి। దోచుభూతలముకన్॥

జయం—(పరికించి) పక్షులు పశువులు- కలకూనికు-వమాగండముల నియా వకాళ్లులు (ప్రకాశముగా) రాకుమారా- ప్రపంచమతివిస్తారము పనమతిరామణీయకము. మనప్రయాణము దూరము-విలోకనకవకాశముకున్నది.

సీ. ఆచంద్రతారార్క-మవ్యయానంతంబు
వసుధాస్థలంబాత్మ వస్తువులకు
నిర్మలనిశ్చలనిర్వాణజాతంబు
ప్రకృతివర్గము పరబ్రహ్మమునకు
పాంచభౌతికము శోధనజీవకుంతత్రింబు
వైష్ణవాదాయమిరావాసవృందు
పారమేష్ఠితము శుంభస్వారసంయుక్త
మాత్మసమ్మానమిగాయఖిలతలము
గీ. సత్వరాజము మేదినీశాసనమ్ము
వసుమతీదేవిశృంగారవాసమనగ
కన్నుపండువనిచ్చు లోకములఁగాంచి
తనియవచ్చును దస్వగత్వరతఁగొన్న.

జయం—మిత్రసత్తమా యావనముమెవయసున, సిద్ధసంకల్పులమైడెందమున,నుత్సాహపూరితులమై కార్యములపట్ల, నిశ్చితమనస్కులమైకాగల్గు వికల్పములకు- మనసారసన్నాహులమయి స్వేచ్ఛాయత్తమత్తులకు-

చ. జలధులు పిల్లకాల్వలు విశంకట పర్వతసీమలెల్లను
వ్వల జీవకాననంబు తలవాకిలి మిన్నొకమేలికట్టుచు

కర్ణలుతలపూలు మేదిని సుఖాస దలి శర్వవస్తువుల్
తలపులు నేర్పువారి మతధర్మ తానుగదా దలంబుగన్.

జయ—సఖా! నీయుత్సాహమునకు, నీసాహసవాక్యములకు నామనం బనల్ప సంతోషమందుచున్నది. సంకల్పసంసిద్ధులెల్లప్రోత్సాహయుక్తములైనచో మనోవిచారములకు తావుండదు

ఉ. హారముపట్ల కాననవిహారముపట్ల భయంకరారిసం
హారముపట్ల రాచపణిహారముపట్లను నార్తరక్షణా
భారముపట్ల కార్యములభారముపట్ల వినోదవిక్రమా
ధారులు రాయభారులు సదావ్యవహార సముత్సుకుల్ గదా.

జయం—నీవాక్యములకున్న గమనపటుత్వము, క్రియారూపమును దాల్చిన ప్రయోజనకారియగు భీకరాటవులు భయంకరమృగసంచారము నిర్జనవనసీమలనాటి గమనోన్ముఖుల మైనందున గమ్యస్థాన మనపాయముగా జేరితిమా భూప్రదక్షిణతుల్యమా.

మం. ఒకపరిభీకరముగ వినవచ్చెడియుగ్రమృగంబుల ఘీంకృతులు। స కలచరాచర జ్వలితభయంకర సర్వవినాశకవహ్నిదవలుల్। పొద లను మెదవెడు తమపరిచదివెను। మదకరకళదుపుల మెదవెడు నాగుల్: కొండకాల్వల నిండెడియేరుల్। దండకాటవుల దాగుసివంగుల్॥ దారుణమారుత భారముచేతను భూతలమందున బాలగుమ్రికుల్॥

ప్రాణవిదారము పరికరహీనము। స్థాణువనంబుల దగుసంచారము॥ వెనుకముందుకని వేగమే తెములుము। గనగను వింతలు కల కాలంబుల్॥

జయం—సచివాగ్రిణీ! పూర్వానుభవననుసరించి బాల్యకాది నేటిపర్యంతము మనయుభయుల శయ్యా భోజనవిహారముల

సందర్భమునను దురాని నీకార్యాతురతను బరికింప నాయాత్మ పరితృప్తిగాఁదోఁచుచున్నది. లేకున్న—

సీ. మకరందమానిర్ఘమ్మని నినాదముఁజేయు
బృంగంబులే పాపప్రాణ భీతినిచ్చు
లేపచ్చికల్ మెక్కి లీలతో విహరించు
కూనమృగంబులే హానిదెచ్చు
పక్వఫలాహార పరితృప్తిజీవులౌ
రాచిల్కలేమిమారామముజేయు
సభ్రదర్శనమాత్ర నల్లానునెమ్ములు
యుద్ఘోషణములె ప్రాణోపహారము
గీ. పిల్లతెమ్మెరలే ప్రాణపీడనంబు
కమ్మనెత్తావియే మారకాధికరణ
వేణునాదమ్ముచల్లని విల్లువలును
ప్రాణగొడ్డమె యౌవనవాసకలిమి.

జయం—ప్రియా! మాటసామ్యముంటివి. అంతమాత్రకంటగింపచనదు. నిరుత్సాహజనకమగు నా వాక్యముల స్వారస్యమును పరమార్థముగా గ్రహించి యయ్యెడను నెడ యుభయాభీష్టసిద్ధియగును. సకలసంరక్షకుఁడును శోభనప్రదుఁడునగు సర్వేశ్వరకృపావిశేషమున్న నెట్టిదుర్ఘటకృత్యములైన తృణప్రాయములగును.

ఉ. నావలమేటి కృత్యమునొందఁగ నోభువనంబుగెల్వఁగా
జీవయమాకుశత్రువులఁ జెండగమాకగు భోగభాగ్యముల్
సేవలుమాకంటంచు పరిశీలనమానివచించు టెంతయుఁ
దైవబలంబులేమిని వృధాయగుఁజెల్లునె పౌరుషేయముల్.

జయం—ఏమిచిత్రముమాటలు-వనకాంతలావేశించి నట్లగపడుచున్నది. అనాదివిహీనమగు నీసంశయమేటికో తెలియకున్నది. ముమ్మా

టికి నీనిదానమే నిరాఘాటముగా మార్గాదర్శమగుగాక రాజ్య భారమును వహించి మంత్రిపురస్సరులను సార్థకాన్వర్థకముఁ జేసి విరాజిల్లు కుశాగ్రబుద్ధులకుఁ బ్రకటించి—

సీ. తొక్కుపలుకులతో బూతులు రేగి పట్టిలు
కొట్టినప్పుడు నీదె కోడిప్రుంజు
తప్పటడ్గులతో యాతఁ బుదొర్లించిన
వేటుసనీదే వెన్నముద్ద
గడికట్టిజట్టీల గాసినివారించు
పట్లనీయదె కదా పంటకాయ
నరపురోతులను పన్నిదమూని కొడ్డించి
యదనుమాన్పిన నీదె యుంగరము
గీ. రాజుబంటులనీయదే ఫౌజుదారు
పులులజూదాన నీదెపోపులుసు వేత
పంతములపట్లనీదె వ్యాసపీఠి
యేలసందేహమిక నదే మేలుకొలుపు.

జయ—రాజకుమారా! నీసత్యవాక్యపరిపాలనము జూచెదను ఈభుజి యించుపటకముల నొకకడి ప్రత్యేకించి యుంచుము. నాయాజ్ఞానువర్తివన్న శపథము వృథాపరుపవద్దు.

జయం—(స్వగతము) ఏమి! మతిచాంచల్యమా! అపూర్వదీక్షయా! నిరంకుశప్రభుత్వమా, (ప్రకాశముగా) మిత్రమా! మార్గాయాసముచే గడుప్రజ్వలితంబగు జఠరంబున క్షీప్రాణాహులుపాయ సాన్నభక్షణము య్యెనే, బాల్యచేష్టలుగానున్నవే.

ఉ. పంతముబూనినైన చలపాదితనంబునకైన హాస్యముల్
వింతలకైన కోడిగము వేడ్కలకైన సమాయకంబులో

చింతలకైన వావులను జేతలకైన విలాసహాసములుఁ
బొంతలనైన శిక్షలకు బోలము న్యాయమె యీవిధింపులన్.

అయిన కానిమ్ము. నీస్వల్పాశయము, జెల్లింపనిపరివాదమేల.

జయ—(పరిశీలించి) మిత్రమా! నామాట జెల్లించిన సత్ఫలము ప్రత్యక్షమయినది. నాముద్దుదక్క యుభయతాలకమయినది.

క. నానుడిసామాన్యంబవి
మానినసీకంటకమ్ము మానప్రాణం
బేనియతిదక్క నిచ్చునొ
కానకదిగమిరింగవలయు గావలదన్నఁ.

జయం—పురోభివృద్ధినే పరమావధిగా పరోపకారమునల్ప ప్రాణిమితుర లీపారము వల్లింతురుగాక. వనకాంతవివాహవేదికపై వసంతకుమారుడంది మోడ్పొసర్చ పరికారము దిగంతవిశ్రాంతమయి కన్పండు వొనర్చు నీవటవృక్షము.

సీ. భూనభంబులకొద్ది పోటముల్ వివరించి
ప్రత్యక్షదైవత భావమనగ
భూతసంతతులనొప్పుగ జేర్చి రక్షించు
ప్రకృతివిడంబనా పాళమనగ
విహాపరంబులవాదు నిర్వికల్పమొనర్చు
సాంకేతమగు రాజసభయనంగ
భ్రమణాంతరేక సంరంభంబులీడేరి
పాదుబెట్టిన ధ్వజావహామనగ

గీ. గగనమునుగప్పి భూమినిగ్రమ్మిదిశల
నలమి వ్యాపించి ఘోరకాననముమేటి
రూపమున నబ్బురము వెరదోఁపువటము
గాంచుమిత్రమకన్నుల కరవుదీర.

జయ—ఆహా! శృంగారపురుషుల మనోభావము లట్లయుండును. ఈవడి తెన్నులమిన్నక గుర్తిమ్మరుట వీరపురుషోచితక్రియకాదు. ఎట్ట యెదుట నీరాజబాట ననుసరింతము. నీదారిని యీవడిమన్న ముల శిరోనేష్టహీనమయి సాగరాదు. ఆశ్వాసయాథుడవగుము.

జయ—(స్వాగతము) ఈయుపదేశములు మిగులచిత్రముగానున్నవే కాదన్న యకారణవైరదాతుకమని యుపేక్షించుచుంటిని. (ప్ర) స్వకుముగా మార్గచోదకుడప్రగమ్మ్య నీప్రభోదనిరాఘాటము నీవ్రిసక్తినిర్వివాదముగును.

జయం—నృపనందనా పిల్లగాలియైన సోకక యింతటి పెద్దవృక్షముశాఖ ఫటాలున గొడ్డటిపెట్టుగానెట్లు కూలినదో కనులారగాంచి యుం టివికదా నాయాజ్ఞాదికార్యమొనర్చినచో నావేగునమనమే మయియుందుమా.

ఉ. ఓకరుణామతీ సుగుణ యోపరరక్ష కృపాసముద్రియో హాకృతపుణ్యశీలనయ హాపరమేష్టి జయప్రదాయ సా హాకలిపాపనాశన మహాపకృతే జగదేకరక్ష వి శ్వాకృతి యోహాదైవత మస్వర్భనిరూపపుః ప్రణామముల్.

జయ—మిత్రోత్తమా! దైవకృపావీక్షణముచే నాయాశీర్వాదము వెం పున నీగండముదాటినది-ప్రయాణోన్ముఖుల మేగడియనైతిమా తదాది విఘ్నములెదురగుచున్నవి. కార్యాంసిబహువిఘ్నాని అని నైచితిమి.

ఉ. ఎప్పటిరాచకేళివనికేగుటలెప్ప విహారగోష్ఠితో నెప్పటివేశ్య రాకడలికెక్కడి మిత్రనిభేదనంబు సొం పెప్పటి ప్రస్తుతాగమన మెక్కడిశానససీమవర్తనం బెప్పటికష్టవిఘ్నముల హేతుకముల్గద యీశ్వరార్థముల్.

జయం—గతంనాస్తి. పూర్వకృత్యములకై చర్చించుట గతజలసేతుబంధనము పరిష్కృతమునకు గడంగుటకర్తవ్యము ఇదిగో మార్గాయాస మపనయింప బురమునకుఁ జేరితిమి. రాకుమారా సన్నద్ధించి నీవుకృతార్థుఁడవుగాఁ దలంచి యున్ననామనోభీష్టసర్వతోముఖముగా నిర్వివాదముగా గొనసాగనిమ్ము - మనయదృష్టము. ఈశ్వరవిలాసము- చిదానందము.

సీ. బురుజుల పైభేర పురగోపురమువాలు
కోటపైధ్వజములు గుడిపసిళ్ళు
మంటపదీపముల్ బంటునివాసీలు
సాల భంజికలు ఘోంషాముతాలు
గోడలచిత్తరుల్ వాడలసద్భటుల్
ప్రాకారజంత్రికల్ పడగరుచులు
దేవదీపరువళ్ళు దేవాణాకట్టళ్ళు
రాజహాజారముల్ మేజువాలు
గీ. ఎదురుసన్నాహమాయమో యాయన నింతదోచె
కొత్తయల్లుండ్రి మర్యాదకోసరమున
వచ్చియుంటిమి మనయత్త వారిపురము
కాపురంబయ్యె మిత్రమా గడచెనము!



## ద్వితీయరంగము.

[ప్రవేశము—మేదరి వెంకేసు, మణిమాల.]

వెంకేసు—(స్వగతం) దిక్కుమాలినముండ కబురులేకుంటే ఈయేల సంతకిపోతే పందిమాసమైన సుకముగా తిందును, గుక్కెడు కల్లుకి మొగమాసికూకుంటే యీమాయిదారి బావనయ్య రాసపిశాశాన్ని నాకు పంపుజేసాడు ఒల్లమాలిననాకొడుకు. నాపందిపిల్లవేంగాను, గంపకోళ్ళుంగాను, ఈమాట తప్పితే గవళ్ళగంగమ్మ సన్నింకవాడుద్దా ఈబుట్టమూలెయ్యిలేదని గుంజుద్దికదా యింటిదిగండ్రి నాపెంటి. ఒళ్లెరగక మసిలిన నా కొంటిముండను జుట్టుపాయిదీసి తన్నకపోతే వెంకేసుపేరుగాదు (వినికి) అదిగో! కొరివిదెయ్యంకాదుగందా చీకట్లో మెరుత్తాది (భయము)

(తలుపుతీసి మణిమాల)

మణి—(స్పృశించి) నాయకా! నాయకా! (మెల్లిగతట్టును) ఏమీ? ఆలసించితినని కోపముకాబోలు! పగలెల్ల పనిపాటుచే సొమ్మసిల్లనోపును! కాకున్ననన్ను కాదని నమ్మించియు! ఇంతతడవు సేయునా! అయిన బేలసయి మానసము దైవపరముఁజేసిన కాంతనని యీనడమా! (ప్రకాశముగా) ఆమాయతగులాటము లేకున్న ఎన్నడే యింతజాగున్నదా! ఇంకొక్కసారి లేపి ప్రియ త్నింతునుగాక! (తట్టును)

వెంకేసు:—(భయముతో కత్తితీసి హా! హా! నీతలచెక్కనగానీ! నన్ను నన్ను దిష్టికొట్టినపాడుదెయ్యము శిరస్సునరగల! నావీరగెందము, నాసాగసూసూచి కంట ఒరప్రికొట్టుకున్న మాయదారిఫీడను

మాయెంగరుపిడితో సావసూకేనూ! చూడు నామీసము ఎంకే
సుమాటంటే పిల్లకూతనుకున్నావా! సూడుమజా! (కత్తి ఎత్తును)
మణి:—(స్వగతం) ఆహా! ఈతఁడు నాతపఃఫలరాశిని సహింపక కలవరించు
చున్నట్లున్నది! నామనోనాయకునిగా ప్రేమించుట కీప్రేమ
సాగరము కదా హేతువు! లేనిప్రేమ కపుగిళ్ళవచ్చునా రాచబిడ్డ
ని కాదని పరిత్యజించిన యస్వాంతప్రేమానికుత్సాహములకు
డివిస్తంభనములు పూలమట్టము జేయుమనికదా గురువాజ్ఞ! అది
యనుల్లంఘనీయము! అవశ్యాచరణీయము! (ప్రకాశముగా)
నాథా! వేంకటేశ్వరా! నేను రాచకాంతను! నన్ను మన్నింప
జనదా! (కత్తి పట్టుకొనును)
వెంకేసు—(ససంభ్రమున) ఏటీ! బేస్తోరముకీడంటూంటే మామసిలిది
ఈయెనురుపిడినెక్కివస్తాడే! మన్యపుశక్తికి కోడికోయ మోసింది!
ఈతవ్వగందము! ఈరసుపంటకం, ఈపంగనామాలు, నానెత్తి
కొట్టవనుకున్నానా నాకుజడిసిగందా కల్లుసీకునంజిన పాపాన్ని
పోతే మావానలచ్చింతోడు ఇంతగాలిపాగపడితే.
మణి:—(ప్రకాశముగా) నేను నాథా! నిజముగా వనలక్ష్మినే! ఇంత
పరాకా! నాకంపినహంసతూలికలు, మధురఫలాహారము లేమై
నవి! నాయదృష్టమునడ్డ అసూయచే నీకానిమానిని యీ
దుర్మంత్రోపదేశ మొనర్చినది! ఈకోళ్ళగూటిలో చింకిపేళ్ళ
చాపమీద కల్లుముంతలు వాసనలో శృంగారభంగమగు నీకత్తి
సాము కేమిటి? నాయిష్టప్రాప్తిఁబ్రమింత వరప్రసాదమైనదా! (కత్తి
దీసి, తెవనెత్తనుంచుచును)
వెంకేసు—(గుంజుకొని) ఏటీ! మొగయేశాలులోకి దిగింది యాపారం.
పోరాసంలేక మూలాలతోంగున్నాడని బింకముకామోసు! ఎందు
కని సూడగా తలెక్కిందంట! జవ్వాలమందిలా మీదపడి సెలగ

గలమని కష్టమ్మకంగా ఎగిరికే! సూడునా దెబ్బ! ఈ మొండికత్తి నామస్సుపుసములో కాలిచ్చించిన చల్లని తల్లి నాకైలుకా డుండంగా నాకదుపుస్తుకదులుద్దా! కాసుకో! (మీసము దువ్వి తన్నును)

మణి:—(స్వగతం) నాయపరాధమునకై యింత కట్టింపుగానున్నది. కారణము సహేతుకముగాఁ జెప్పి క్షమింపవేడకున్న నాగత్యాం తరకృత్యము సాంగము కాదు. అనచారముపొందియైన వలదన్న మంత్రికుమారుని దుంఖాంతములో కవిశుద్ధము గావింపనా! (ప్రకాశముగా) నాథా! నా పూర్వపు భర్త వచ్చుటచే! లోకా చారమునకై యింత ఆలస్యమైనది! నిత్యకృత్యములకెట్టి యప చారము మొనర్చినను ఈశ్వరాలనుసాక్షి! కాదని తన్నిన బంతు లాటగా సహింపుము కొనలేదా! నన్నుమన్నింపని కారణమేయిది! గురువాజ్ఞదప్పిన శాపోపహతముగానా! (కౌగిలింపబోవును)

వెంకేసు—(నిస్పృహతో) ఛీ! బుద్ధిమాలిన పెద్దమ్మోరా! నాపని కూలా ఈపనివాటుతన పసికి గాలాలుబాబో! ఈ మొరి ఇకిలిం తలు, సకిలింపులు, సాగితే పెద్దకాపరం చేసేద్దునులే! లెగు! లెగు! నాలోకువ వోసన కొట్టుకేదని జెమా! ఏటీ! యేసం! ఇంత రంగేంటి! మెరుపేంటి! జంగ్ర్యేంటి! నీదొమ్మకొట్టా! (తోలుగు, తోలుగు, గెంటబోవును.)

మణి—(స్వగతం) పురుషులు స్వతహా స్త్రీలయెడ అనుమానాస్పదులు. పరులు మాటెత్తిన మొదటికేమోసమగును! ఈద్వంద్వముకడ తేరినా కార్యసాఫల్యమగుటెట్లు! నచ్చబలుకుట నావంతు! (ప్రకాశముగా) స్వామీ! మణిమాలను! నన్ను పేక్షింపఁ జెల్లునా? నామానసమందు ధారవోసిన యపరాధమున కింత నిర్ద యా! ఇంతతడవేల?

వెంకేసు:—(స్పృహతో) ఏటీ! కొంకకూలా! నావంటి మొండిదయ్యముా! అంటే రాసబిడ్డనని వాడాలిగందా అంతపోరోసముంటే నాతలగొట్టి ఈపెంకిరాలుగాయితనమేంటి! దేవతల్లా అవ్వతరించి నాపేమ జూపిత్తానంటేగందా కొండంతపని! ఊరుబాబుల పనులొప్పుకున్నదంతా ఈకసి ఒప్పలెక్క-దీసుకోని తెగిసికూకున్నానుగందా! నాకుక్క-బుద్దిపోయిందా! నాయెర్రి దిమ్మతిరేగిందంటే (కళ్ళు కొలికి) లెంపలేసుకుని మరేనోరెత్తు! మాయింటిదాన్ని మన్నించనని తెలియదూ!

మణి—(చెంపలు వేసికొని) మనోప్రియా! నాతప్పిదముకాదు! లోకుల సిర్బంధము! దైవఘటనమున కట్టినది! (శయ్యజేరబోవును) నేను విన్నవించుకొనలేదా! నాపూర్వపుభర్త......

వెంకే—(ఆగ్రహముతో) ఛీ! సీకుండా మొయ్యా! నాబట్ట-బట్టకీ! నాబట్టనాతలగడుగుతే. నాసొపుకత్తి! ఎన్నిపొట్టేళ్ళు ఎన్నివందులు ఉసురుపెట్టిందికాదూ! సెట్టలలెక్కంటే! ఆడిబతుకెంతో ఆడెంతో! నామునిమీసాలతో గేలమువేసి ఈడ్చుకురాకుంటేసూడు! నన్నునమ్మకుప్పపడుసును ఒల్లమాలిన బింకాన్నికాదన్న మొగాణ్ణి నాయింటిముంగిట మాపెద్దసెట్టుకు పొలిగట్టకుంటే నాపేరు వెంకేసేనా సొప్పుకు! అన్నిమానాంతరాలు దాటి నామనసిచ్చిన సుక్కను ఎడబాపే పెగ్గెలుంటే కామందు తెసంచూపాలి! ఓలే! (మణిమాలవైపె) ఇదిగో! సీతోడు! నా ఉసురంతా ఆడిక్కె నాకొట్టల సన్నద్ధగించిన మొగోడుంటే! నిజముసొపుతా! ఈమేదరవెంకేసుచేతికత్తి బిరుదుసొప్పినాఖామందుపసచూపించు! ఈపడ జగాల కాసుకుంటే చూద్దాము మాకులముసామిఇచ్చిన రచ్చరేకు దిగతుడిచినానంటే నాసిరి

సిరిముమ్మసాగిలబడ్డా కుండెను నెత్తురుకక్కుకొని ఆపనిసక్క బెట్టిరావే! నాసుకా (కత్తి అందించి బింకముగా చదికిల బడును.)

మణి—(స్వగతము) ఆహా! ఈతడెంత నిష్కర్షగా వర్ణించుచున్నాడో! నాశపథమేమైనా పసిగట్టియుండునా? లేక కోపాధిక్యతచేనుడువునా? (మనమూ ఆలోచించుకుని) ఎట్లయిననేమి నామనస్ఫూర్తిగా నమ్మికొల్చిన ప్రతిఫలముగా నాదీర్ఘక్రోధనిష్ఠలనమే కార్యసాఫల్యముగా నుద్బోధించు నీప్రేమమూర్తి విన్నపము నిరసించి తరుణముగోల్పోరాదు (విశ్వసించి ప్రకాశముగా) నాథా! మరొక్కమారు నామనస్సు చెల్లించి సెలవుదయచేయవలెను ఈకత్తి నాప్రేమశాసికముగా లభించినదా?

వెంకే—(చేసరసముడిగి) ఓసి! ఎర్రినాసిట్టి! నామనసొచ్చినోడుకన్నా కాపురాలే నీవసనాలన్నంటే మూరుపేరెట్టు! నాకత్తి మొక్కితే దయ్యాలుడద్దరిల్లేయట మాజేజెమ్మనాడు నావసమాలినపడు సుదాన్ని భంగపెట్టడంకాక సేతగిందా జేసురు కమిలిసాదకం చేయించాను, నావోక్కదేవుణ్ణికొలిత్తే నెత్తిమీద సూరిచంద్రాలుడుంటారుగందా, ఒకబట్టసాప్పి, నీతలకొట్టి, నామొగోడితల మాయిటిసెత్తికి మొక్కి సెల్లించు నీసోబతేలుద్ది!

(కత్తి విసిరివేయును)

మణి—(గైకొని) నాథా! నావిశ్వాసమునుగదా ఈవీరఖడ్గము కోరుచున్నది మనస్సు చెల్లింకని విశ్వాసహీనమగు నీద్రోహము రాచపట్టికర మలంకరించిన పాపహేతువు అనుభవించకతీరదు. నా చిత్తపరిశోధంజేయు నురంతమింతటితో నంతరించుగాక.

(నమస్కరించి నిష్క్రమించును.)

## తృతీయరంగము.

[ప్రవేశము—అంతరగృహము.]

కోయదొర, పుష్పవతి.

పుష్ప—దొరా దొరా! ఏమినీబండపిదప్రకూలిపోను అపరకుంభకర్ణుడవు కాబోలును. మనవిచ్చేసిననని పక్కకేసుకొని నీమనసెట్లొప్పినది. నీశపథముకూల. నీమాటనీళ్ళలోమూటని మొదటనేచెప్పలేదూ. మెత్తగవంచించుటకు మొనగాడవూ.

కో-దొ—ఏమిటే నీలాపనిందలు మేళా గేళామూని అప్పనముగా రాచకూడు ఒంటబట్టిబక్కముండవాణ్ని పిచికమీదచంద్రాయుధమని నామీదసవారీ తీస్తావూ. ఏం పుట్టిమునిగింది

పుష్ప—కొంపటుకొంది. ఉత్సవిగ్రహాల్లా తేరమొక్కుబళ్ళుచెల్లించడమనుకున్నావూ, వ్యవహారమంటేనూ, "ఈగిల్లుఅలుకుతూ పేరుమరచినట్లుంది" రాజపుత్రులునగరిలో పాగాలేశారు.

కో-దొ—నీబొందపడా ఇవ్వాళ్యాబ్రతికి ఇంటివెనకాలచచ్చినట్లు బరిమీదవదలుతే పసకనిపించేది. ఇప్పుడిళ్ళ పిల్లావల్లా వుందినీవు ఇంకా ఎదురట్టించేటందుకు తగుదునమ్మాలని వచ్చావూ. నేనంతా అమారుపర్చానులే.

పుష్ప—ఏమిసరంజామూ. రాకుమారుని శయ్యాగృహమున జయపాలుడుసహితము తోడుపండుకొనునట ఎంతసిగ్గు మాకుల పోళ్ళెచాటున బుగ్గలునొక్కుకుంటున్నారు. ఏమిమారుమనుములు, ఏందురంతాలూ.

కో-దొ—చెట్లుజెడేకాలానికి కుంకమూతపిందే. పిదప కాలపుబుద్ధులిల్లా దొర్లుకొస్తున్నాయి. కాని మనగొప్పైనేతిలో పడుతుంది.

పుష్ప— నేతిలోనంగతల్లావుంది మనమీనాకోతిలోబడివున్నాము ఏదో అత్యవిష్టాకరముకంటె ఆదినిష్టూరమే మేలనిపిస్తోంది.

కో-దొ— నీభయముమానిపోనూ! నేనుండగానీమీద ఈగవాల్నిస్తాననుకొన్నావా చూడు - ఈద్వందంలో కుటుంబకలహాంపెట్టించి నాశపథ నెగ్గించుకోకుంటె నామీసం.

పుష్ప— కలహామేకాదూ - మనమజాహుజూరులల్లాముట్టడించాలి నాటితో నాకోపాగ్ని చల్లారుతుంది

కో-దొ— రేపువిందువుకాని, తినబోయిరుచులెందుకు, మణిమాల యదుగుజాడలు వినవచ్చును- నాపనివినిజాగ్రత్తగా మసులుము.

గీ. కోడెతాచులమెడ గుచ్చుకొనుటబాగు
మేటిబడబాగ్ని గుక్కగామింగబోలు
కత్తిపైసాము లందిరిగడువవచ్చు
రాచపగపట్టు నెగ్గగారాదుసూవె.

పుష్ప— దేవుడు మనపాలుండాలి-మనదినాలు దిరగబడాలి ఒక్కదేవుడికైనా మాత్యంలేదూ.

మం. పోలేరమ్మకు పోతుమేకనూ। కాట్మాయినికీ కల్లువారలూ। పీరుసానికీపిద్దుండాళ్ళూ। అలివేలమ్మకు హారతిజ్యోతులు అందించెద, కొండదేవత। దుండలమ్మా వెళ్ళివస్తా। వీరదేవరాత్రముక్కేదేమీ। గ్రుక్కనదేవీ.

సీ. ఒరనుండిపెరకిన యుగ్రమైకస్పట్టు
శాతమా చంద్రహాసంబుతోడ
ముఖముపైజారిదమ్ముల భీకరంబైన
తీక్ష్ణించుకస్తూరి తిలకమొప్ప
జడవిడితలఁజుట్టి గడువికటముదోచు
జీబూతమౌ జుట్టుజేటుతోడ

కచ్చువిచ్చిన భయ కరదీప్త మహారాజు
నాయతంబగు కన్నుదోయితోడ
గీ. కచ్చ లెడిపిడి కాటుక కణాలలంటి
రవికముడిజారిపయ్యెద తొలివిడుచు
రుద్రితరమున కాళికాకారముల్లు
వెలుపుదోపగ మణిమాల వెలసెనెదుట.

కో-దా—(స్వగతము) మాదిరమ్మన్న కాల్పివచ్చినట్లున్నది. ఈపిల్లల చెలగాటము తెలుకపాత్రిణ పోకటముకాదుగా (ప్రకాశముగా) కాంతా సుందరబహ్మహార్మ్యపరితలముల చంద్రప్రసాదముల మణిమయకుడ్యమస్థంబుల దివ్యమందిరజ్యోతివగు రాచకాంతవు-గృహకాంతవు-వీరమాతవు.

చ విరులవనంబులా రుచులవిల్చెడు స్వాదునగంబులామనో
హారమగుతావులా సుఖవిహారమొనర్పగ మందిరంబులా
పురములగోపురంబుల యపూర్వపుభూకుహారంబువాసమే
గరితకురాచబిడ్డకుబాకాల టగత్యమె శాస్త్రకృత్యమే.

మణి—శాస్త్రకృత్యములాదోరమిన్నాగవని న్యాయాన్యాయములు విమర్శింపయోగ్యులగు యోగివరుల కీవిరావేశమే సంసారమూలచ్ఛేదమంత్రమగుగాక. యోగముదాధిదేవతయగు నీకరవాలము గురుసత్కారచిహ్నముగా బ్రసాదించితి.

చ. అరులనుగాంచియేమి పరిహాసముజేసెదు మోసమూర్తికిన్
దెరువెదిచూపుచుందు పరిదేవనకైయెది యొద్దబోదుసు
స్థిరలకునేది మాటెదుయధేచ్ఛకునెయ్యది పుట్టగింతుసం
గరమునవేదిగెల్తు వుపకారమగైకొనుమీ కృపాణముల్.

(కత్తి చేతికందిచ్చును)

కో-దా—కాంతా! ఏమిసాహసమా పిచ్చికుదిరి రోకలితలచుట్టమన్న ట్లే నీపురుషయోగ్యమగు ఖడ్గము హే! రక్తసిక్తమతిదారుణ ము. ఇసీ, పెం పెసలగు మఱువాల్పు చిత్రసంహారకారకమగు నీభయదస్వరూపము.

ఉ. ముట్టితొ ఘోరశత్రువ్రుల మోహరమందసిధారచంద్వగాఁ
కట్టితొ యోధులన్ దిటవుగాఁ బరిహాసము జేతలందుఁ
కట్టితొ కంకణంబు మిడిగారవికల్పన మొప్పఁజేసిరా
పుట్టిని కారణాంతరము బట్టెనె యీవిధి నన్ను బట్టగన్.

మణి—దొరా, ముక్కు పచ్చలారక తారుపెరదెలియక రాగమోహ ములఁ దిక్కుగానక, బాధ్యతలపాటించరాని యకాలమునవత్స ముకంఠపాశంబుబోలె సంసారతగులాటములనల్లి సర్వస్వేచ్ఛ లబాధించి యిహపరావరోధకమగు మాయసంసారబాధావి ముక్తికరమయిన-

కో-దా—(స్వగతం) ఆహా పుష్పవతి యదృష్టవంతురాలు ఆమెయదృష్ట ముపండి యీమెట్టవేదాంతమీమె బుర్రకెక్కినది జోక్యము లేక నేతలంపు నెరవేరినది (ప్రకాశముగా) నీవైఖరీప్రసంగము గ మంశోచనీయము స్త్రీసాహసమే

(చెరలో)

శా. ఆహా దౌష్ట్యము మనష్కృతంబు ఖలుడే వ్యాఘాతముఁ ద్రోహమున్
మోహోపద్రవముఁ భయంకరములమ్మో భర్తృనాశమ్మనా
యూహ తథ్యమునామయుంబరగె కీయోగ్యమొగ్గో లేరేభటుల్
సాహాయంబ జయంతపుత్రి వినాశంబ్రౌ తెమాయావిధిన్.

ఆహా మిత్రమా! గండములన్నిగాచి కడసాంకేశవ్యాఘ్రహాము న నిజతల్పమున ప్రత్యక్షముగా రాకన్నులెదుట హాహాతవిధీ-

మ. అనువున్ జెప్పవమ్మ్బి కాతులనికంశరాజ్యంబులేమయ్యె, నే
మనినిర్ణీతమొనర్పవయ్యలకు క్షేమంబెల్లనేదెల్పెదన్
చనుమానంబిక యంతరించనేపునర్జన్మంబులేదయ్యె నే
వినవా చూడవ పాత్రిణమిత్రునిముఖంబింతేహ్యమే, పాపమే.

కాదని నివారించిన నావేశంబున ఉల్లంఘించుచు నార్యులవాక్యములు వృథాపోవునే రాజకాంతా మణిమాలా, స్త్రీసాహసమెంతకు దెచ్చినది.

చ. కరముకరంబుబాన్పి సుముఖాహ్వయకీర్తన నగ్నిసాక్షిగా
గురువులుసాక్షిగా నిగమకోటులుసాక్షిగ పృథ్విసాక్షిగా
సురలునుబాడితోత్తములు సూరిజనంబులు సర్వసాక్షిగా
పరికరమైన వీరవరపాలుని భామ్యసా దూష్యవైతివే.

(తెరలోకలకలము)

ఓం శాంభవీ, జగన్మాతా, ఓంకారభీజాక్షరీ, అంబా, సర్వానర్థములం దెగటార్చెడువక్తిమయా, యమ, మాతా, సర్వావస్థల సాగిలిమ్రొక్కెదస్వామి, కృపామతిజేతా.

గీ. అంగానాసికీవే మంగళాహారతుల్
చెంగాటాగ్రకోవె శ్రీసాంబునీరాణీ
పంచుటనంటులు పచ్చనిపోకలు
మెండుబిల్వములు గరివేరంబులు
పచ్చకర్పూరము పలుకాశ్మీరము
నచ్చినపసపులు నాడెవుమెసవులు
వెండిపళ్ళెరము పైడిపాత్రితో
పూజలొనర్చెద రాజేశ్వరినిన్.

జయ—(స్వగతం) ఏమి చిత్రరేఖ యెంతస్వామిభక్తురాలా! కాళికాదేవికి మ్రొక్కులిడుచున్నది. దైవపూజామహాత్మ్యమున్నచో నీఖండతుండెములగు నామిత్రునిమృతకళేబరమీమెకు దృష్టిగోచరముగా నట్లమర్చియుంచి పర్యవసానమును జూతును.

చిత్ర—ఆహా, ప్రార్థనమందిరము చిన్నపోయినదే. కాళికావిగ్రహము కానరాకున్నది. నిత్యనైవేద్యమందుకొన నీలాలశపీఠిని నిత్యద్యుతితోవెలుంగు సూర్యకాంతిపోలె నీలాలకావృతవిశాలఫాలభాగమున బండగునింమతిలకము మెరయ నాకెదురుజూల దేవీసన్నిధానము.

ఉ. నీరములందలేదొ యుపనీతసమర్పణలేదొ పూవులన్
గూరుపలేదొ పత్రముల గొల్వనొ వెట్టనొ ధూపదీపముల్
కూరిమిభక్ష్యభోజ్యములకున్ బొరజేసితినో దలంపురన్
నేరములేమొనర్చితిననీవిధిజేతువె భక్తురాలినిన్.

ఏమి నాయాత్రము ఈమోహ్రలభోగశయ్యపై బండుకొనియున్నది. కాళీ అమాయకురాలినిజేసి యానీడాగురులు (స్పృజించునంతలో)

ఉ. ఆగుము రాక్షసీ! కులటవంచుదలంపక వాచపోడిమిన్
నేగరముల్ గ్రహించితిమనీషులు మెత్తురె దుష్ప్రవర్తనల్
సాగునెపీరకంఠమును శయ్యకుదార్చిహరింతులేభువిన్
రాగలకాంగ తెల్లగొన రానినుగూర్చెడు భర్తృసేవలన్.

జయపాలా—పట్టు-దాటనీకు-బాధింపుము-దురంతమా- అంతఃపురాంగనా నిలునిలు శత్రురాలా గోముఖవ్యాఘ్రమా- తృణావృతకూపమా- పయోముఖవిషకుంభమా.

శా. ఏదీఖడ్గము తోమరంబెచట యేదీబోటుబల్లెంబురా
దేదీశస్త్రము ముద్గరంబుగదయేదీ రౌతురాహుత్తులున్

జయ—కాదేయుద్ధము సంగరంబులనులున్, కాంతాపచారక్రియా
వాజాధర్మనిబర్హణంబులకుఁ వంచింపరాదోత్వరన్.

చిత్ర—దేవీ జగన్మాతా తల్లివిదండ్రివి సర్వబాధుగణము భూనభో తలములు సాక్షాత్ మహామాయారూపిణివై శక్తిప్రదాయినివై భక్తశరణ్యమని నీపాదసరోజాతములచేతఃప్రీతిప్రణమిల్ల మొక్కఁబోయిన ముప్పువచ్చినది.

ఉ. భూతమదయ్యమా యముడబోయుడ వేగిననుండ దొంగయా
ఘాతకుడాపిశాచను యాకారణదైవమపాపరూపమా జేలిముదద్దరిల్లె

జయ—.................సఖి జేసినపూజల కిచ్చు మెచ్చి చే
యూతయొసంగ దైవతము యోగ్యతమానె జయించెభక్తియే.

చిత్ర—(స్వగతము) దేవీమందిరమున పరపురుషస్వరూపము భర్తృచే దర్శనభాగ్యము అన్యోన్యవిరుద్ధములుగానున్నవే! (ప్రకాశముగా) దేవా! భవదీయపాదారవిందములకు దాసురాలనూ ఈకట్టుకథ నాదోషసంజనితకారణ మయినక్షమించితరుణోపాయముఁ జూపికృతార్థురాలనుజేసినాచనువు పాలింపమని ప్రార్థించుచున్నాను.

జయం—(సంరంభముతో) ఆహా! జయపాలానీసమక్షమున నే యింత యకృతముజరిగెనా నీతిమాలినస్త్రీజాతమున కిచిత్రరేఖగుణి బోధకురాలయినది.

జయ—"సహవాసదోషేణగుణాభవంతు" కౌరవమాలుచెలిమిచె నాత్మ నాధుజీవముల ఆత్మహత్యగావించినమహాపాతకురాండ్రయాగద లేమందుమూ.

చిత్ర—రాజకుమారా! ప్రియనాథా జనసామాన్యనైజమగు ఘోర దౌర్జన్యస్వరూప మీూషఁ మాత్రభక్తిపరతంత్రబుద్ధినిఁ గాని మూర్తిత్వముగాంచదు.

జయం—కాదనినివారించిన వసంతసేనప్రబోధము లాలకించిన నింత ముప్పువాటిల్లకుండెడిది. పరోపకారపారీణమతియగునాయమ నిర్వ్యాజోపదేశముల నిష్కారణమసాధారణ స్త్రీతుల్యములు తృణీకరించిన నాయకార్య మీా ఘోరరూపముగా వచ్చి వేధించినది.

చిత్ర—రాజేంద్రా! ఆర్తత్రాణపరాయణయగు మహాకాళి దేవరసాక్షిగా మణిమాలా ప్రేరేపకముం జేసి నాపరదేవతా శక్తిని శోధింప సంకల్పించినది.

జయ—ప్రాణప్రియా! నీదైవభక్తియే స్వరూపముదాల్చినదోయన నాప్రాణమిత్రునకుం బునర్జన్మమిచ్చి మాయన్యోన్యప్రేమవల్లరికిని నిర్వికల్పమగు దోహదమిచ్చినది.

జయ—పాతివ్రత్యప్రమాణమగు చిత్రరేఖాసందర్శన భాగ్యమున మిత్రోత్తమా! మనయుభయుజన్మలుసార్థకమయినవి వయోబుద్ధుల నబలప్రాయమగు నీదంపతివ ప్రాణరక్షణ కుపకృతి తోపకున్నదికదా.

చిత్ర—ఆర్యా! మనుష్యమాత్రుల కీయుగ్గడింపులుచెల్లవు దైవసంఘటముదాట స్వాతంత్ర్యముగావని ప్రాణికోటి పృథాహంభావమునం జేసికాలాపహారణమొనర్చునంతలో నాపరమేశ్వరిభక్తికిలీనమయ జీవన్ముక్తింగాంచనగును.

జయం } —చిత్రరేఖా! పిన్నవయ్యు నీయుపదేశమే సర్వాంతర్యామి
జయ } యగు మహాకాళిసందేశముగా గ్రహింతుము. మరియునా భక్తసంరక్షకయగు జగదేకమాత దయావిశేషముచే

చ. తొలగుత దార్ష్ట్యముల్ సుకృతిదోచుక తోయజనేత్రులందు గో
వులు భువిదేవతల్ ఘనముబొందుత దైవతపితృపూజలం
మెలగుత బాల్యనాటకము మేదినిధర్మముసత్యశౌచముల్
జెలగుత చిత్రరేఖగతిశీలవతుల్ నుతికాంతుగావుతన్.

అహో! మహాప్రసాదము.

స ౦ పూ ర్ణ ము.



రామప్రెస్, రాజమండ్రి.

# అనుబంధము.

---

కనుగొనుమా వసంతమహిమ సుందరీమణి
సుందరమైన సుమనికరము లెన్నియో ॥క॥
సెలదేటి దారులన్ నేలయేటి బారులన్
మధికానంద మొసగుచుండె బాగడతరమా ॥క॥

జయపాలుడు.

వలదు వలదు మిత్రమా నామనవి వినుమా మిత్రమా
నేనెన్నడైన యనృతమాడితి నాపలుకులు విశ్వసింపుమా ॥వ॥
వారవనిత మనల వేరుజేయ జేసెనయ్యో ॥వ॥

జయపాలుడు.

కరుణాకర - లోకేశ్వర - సర్వేశ్వర - హేపరాత్పరా
పరమపురుష విగతకలుష నుతచరితా హతదురితా
సతతము నిన్నే దలతు గాపాడ రావదే ॥క॥

మేదరి

బుట్టలల్లి ఇయలెదన్ని నన్ను పట్టిరి బాబు
కల్లుతాగి నేను ఇంటిబైలయుండగ
యీబంట్రోతు నన్యాయముగా కొట్టుకొంచు
తిట్టుకొంచు పటిబాబు
దండాలండి బాబు దండాలండి బాబు ॥బు॥



# అదృష్టదీపిక

సోదరా! నీయదృష్టము నొకసారి చూచుకొనుము.

"అదనునకు అందనిఅప్పుల"వలె నీయదృష్టమును ఎవరెన్ని విధములఁ జెప్పినను తప్పో ఒప్పో గాకపోదు. మొగమాటమునకు కల తెరంగంతయు దెలుపక నిన్ను చీకాకుపరచు నవసరము లేకుండ దురదృష్టగ్రహశాంతికొరకు నీ "అదృష్టదీపిక" కరదీపికగా నుండగలదను నమ్మకముతోఁ బెక్కుసంగతులు జేర్చి, ముహూర్తభాగము, జాతకభాగము, సాముద్రికభాగము, వాస్తుప్రకరణము, ప్రశ్నభాగము, గౌళీశాస్త్రము అను ఏడుభాగములుంగలిపి ఒకేపుస్తకముగా బయిండుచేసి యున్నాము.

సర్వజనులకు నుపకరించునది గనుక వెల 0—10—0.

# ప్రణయసామ్రాజ్యము.

గ్రంథకర్త:-

రసజ్ఞకవిశేఖరులును, సుప్రసిద్ధ నవలా రచయితలు నగు

శ్రీ కర్లపాలెం కృష్ణరావు గారు.

నూతనభావములతో, క్రొత్తపోకడలతో, వింతరుచులతో, మృదుమధురమగు శైలిలో వ్రాయబడి సాటిలేనిదని ప్రఖ్యాతిగాంచిన నవలారాజము.

వెల రు 1—8—0

# దస్తావేజుల మతలబు

లోకవ్యవహారమునందు ప్రవేశముగల ప్రతివారికిని అత్యంత ప్రయోజనకరమైన గ్రంథము. అర్జీలు- పిటీషనులు- ప్రోనోట్లు - ఇల్లు భూమి తనఖాదస్తావేజులు - పంచాయితీతీర్పులు - డిక్రీట్రాన్సుఫర్లు - ప్రోనోటుట్రాన్సుఫర్లు- హక్కుఖత్తులు- మరణశాసనములు- వీలుదత్తతద స్తావేజులు- దత్తతఅధికారపత్రములు- దానపత్రములు - మనోవృత్తిద స్తావేజులు-కవుళ్ళుకదపాలు- ఖండగుత్తకవుళ్ళు- అద్దెచీట్లు- హక్కువిడు దలదస్తావేజులు- గోడ సందు హక్కులనుగూర్చి- మనోవృత్తిహక్కుల నుగూర్చి-ఇల్లుక్రియమురద్దు - పవర్ ఆఫ్ ఎటర్నీలు - పారీవ్యాపారపు దస్తావేజులు-రశీదులు-అదియిదియననేల? వ్యవహారసంబంధమైన సర్వ విషయము లిందుగలవు. ప్లీడర్లయొక్కగాని ప్రయివేట్లయొక్కగాని సహాయములేకయే స్వయముగా సర్వవిషయములను ఈగ్రంథసహాయ మున నిర్వహించుకొనవచ్చును. గృహమున నీగ్రంథమొక్కటియున్న చో గొప్పసలహాలనిచ్చు ప్లీడరు నొకని కొనియుంచుకొనినంత ఫల మిచ్చును. వెల 0—12—0.

 మాకేపుస్తకములు కావలసినను

దోగిపర్తి సుబ్బారావు,

బుక్కుసెల్లరు, చీరాల.

అనివ్రాయవలెను.

# నవలలు—పరిశోధకనవలలు

పంజాబు మెయిలు 0-12
నీవేనా 0-12
చదువుకొన్న భార్య
(Educated wife) 0-12
శక్తి కుమారి 0-12
అయిదులక్షలరూపాయలు 0-12
అల్లూరి సీతారామరాజచరిత్ర 0-6
రమాసుందరి 1-0
హాతింతాయి 0-12
ఇంద్రజాలము 0-12
రాజద్రోహి 0-12

విషహృదయము 1-0
టోపీదాస్ కామిక్ 0-6
వలపులరాణి 0-12
దొంగలనాయకుడు 0-12
అర్ధరాత్రపువింత 3 హత్యలు 0-12
లోకాభిరామాయణం కామిక్ 0-6
పరిశోధన 0-12
మోహపిశాచము 1వ భా. 0-12
2వ భా. 0-12
రక్తవాహిని 0-12

# కథలు—చరిత్రలు

శ్రీనాథకవిచరిత్ర 0-12
భోజకాళిదాసుకథలు 0-12
భట్టివిక్రమార్కులకథలు 1-4
గులోబకావళికథలు 0-12
తెనాలిరామకృష్ణకవిచరిత్ర 0-12

మహాపతివ్రతలకథలు 1-0
పండ్రెండురాజులకథలు అను
శ్రీకృష్ణబోధామృతం 0-12
శుకసప్తతికథలు 0-8
మదనకామరాజుకథలు 0-8

మహాభక్తవిజయము అను 30 మహాభక్తుల కథలు ... ... 1-0
అరేబియానైట్సు కథలు 520 పేజీలు ... ... ... 1-0

# శృంగారగ్రంథములు

పడకటింటిముచ్చట్లు 0-12
సతీపురుషరహస్యములు 1-0
శృంగారపద్యములు
లౌలెటర్సుకు ఉపయోగము 0-4

మన్మథసామ్రాజ్య మను
కళాశాస్త్రరహస్యములు 0-12
అంతఃపురరహస్యాలు 0-12
మోహలేఖలు అను లౌలెటర్సు -12

---